

# జగత్ కళ్యాణ ఫార్మశీవారిచే

తయారుచేయబడు అమూల్య ఔషధములు

## రత్న పురుష లేహ్యము

ఈ లేహ్యము ఇంద్రియ శీఘ్రస్ఖలనము, మూత్రమువెంట ఇంద్రియం పడుట, స్వప్నస్ఖలనము నాపును. ఇంద్రియము గట్టిపరచును, కండ పుష్టిని, వీర్యపటుత్వమును కలిగించి అమిత సంభోగశక్తి గలిగించుటలో గజ బలము కలిగియుండును. యీ లేహ్యము సుకుమారులకు, పత్యము చేయ లేనివారికి (TONIC) టానిక్‌గను ఉపయోగపడును.

పౌను రు. 4-0-0 పోష్టేజి ప్రత్యేకము.

## యోగరాజ గుగ్గులు

యిది ఆమవాతము, ప్రమేహము, వాతరక్తము, నాభిశూల, అగ్ని మాంద్యము, నడుము, మెడ, భుజము, మోచేతులు, మోకాళ్లు, వేళ్లు మొదలగు వాటి జాయింట్లలో నొప్పులు, పోట్లు, వాపులు తగ్గించును, స్త్రీల రజో దోషమును, పురుషుల శుక్రదోషమును హరించి సంతానయోగ్యతను కలి గించును. యిది బలవర్ధక ఔషధము.

తులం రు. 3-0-0 పోష్టేజి ప్రత్యేకము

---

దొరుకువారు :—

**ఆంధ్ర జనరల్ ఏజన్సీస్,**

పోష్టుబాక్సు నెం. 137 **విజయవాడ-1**

# పెళ్లాలసమ్మె

[ఏకాంకనాటిక]

రచయిత :

[illegible]ంగవోలు వెంకటేశ్వరశాస్త్రి

శ్రీ నాగేశ్వరీ నిలయం



పబ్లిషర్సు

ఆంధ్ర జనరల్ ఏజన్సీస్,

పబ్లిషర్సు, బుక్ సెల్లర్సు అండ్ కమీషన్ ఏజంట్సు

పోష్టుబాక్సు నెం. 137

విజయవాడ-1

 1955 [రు. 0-8-0

# పాత్రలు

## పురుషులు

| | | |
|---|---|---|
| విష్ణు | ... | రిపబ్లిక్ ప్రసిడెంట్ |
| మహేశ్ | ... | మరణశాఖామంత్రి |
| బ్రహ్మన్న | ... | ఉత్పత్తిశాఖామంత్రి |
| గణపతి | ... | ప్రారంభోత్సవశాఖామంత్రి |
| గంగరాజు | ... | గాజులబేరం |

## స్త్రీలు

| | | |
|---|---|---|
| అనసూయ | ... | మహిళాపార్టీతరఫున సత్యాగ్రహురాలు |
| పార్వతి | ... | మహిళాసభ కార్యదర్శిని |
| లక్ష్మి | ... | మహిళాసభ కోశాధిపతిని |
| భారతి | ... | మహిళా సభాధ్యక్షురాలు |

# పెళ్లాల సమ్మె

[అదో రాజభవనం—ఓ పెద్దయీజీచైరులో విష్ణు పండుకొనివుంటాడు; బిళ్లగోచీపెట్టిన పంచె—లాంగ్ కోటు—పైన వల్లెవాటు—కళ్ళకుజోడు—తలపైన కాంగ్రెసుటోపి వుంటాయి. సిగరెట్ కాలుస్తూ పత్రిక చదువుతుంటాడు. గోడలమీద దేశనాయకుల ఫొటోలు, త్రివర్ణపతాకం, అశోకచక్రం మొదలైనవి వుంటాయి. కుర్చీకి కుడివైపున వంకిపెత్తం అన్చియుంటుంది. ఎడమవైపున ఓస్టూలు దానిమీద సిగరెట్ టిన్ను దానిమీద అగ్గిపెట్టె, ప్రక్కగానే యాష్ అమర్చివుంటాయి. చుట్టూ ఇంకో అయిదారు కుర్చీలుగూడా వేసివుంటాయి. చదివే పేపరునాపి ప్రక్క స్టూలుమీదగా పారవేస్తూ కుర్చీలో పండుకున్నవాడమాంతంగా లేచికూర్చుంటాడు. చిరాకుగా వుంటాడు.]

విష్ణు: పెళ్లాలసమ్మెట – "పెళ్లాలసమ్మె. ఈ సమ్మెలగొడవ వినలేక సతమతమైపోతున్నాను. ఏ వాల్ పోస్టర్ చూచినా, యే వార్తాపత్రిక చదివినా పెళ్లాల సమ్మె – పిల్లలసమ్మె – ఆడవారిసమ్మె – మగవారిసమ్మె – చచ్చినవారి సమ్మె – బ్రతికినవారి సమ్మె లంటూ నా తలకాయంత అక్షరాలతో నలుమూలలా ప్రత్యక్షమై ప్రాణాలు తీస్తున్నాయి. ఏదో అవసరమైనదానికి సమ్మె చేయటం; అనక మానటమయితే పదిమంది

విన్నా పరువుగా వుంటుందిగాని - యిదేమిటి, యీ అన్యాయం? "బట్టలవుతుకు బాగులేదంటే" చాకళ్లు సమ్మెచేసి చంపుకతినటమా? "గడ్డం బాగాగీకవయ్యా" అంటే మంగలివారు సమ్మెచేసి మాటాడకుండుండ్లటమా? మొన్నటికిమటుకు మొన్నటిమాట నాకొడుకు పుట్టినరోజు పండుగనాడు నలుగురూ వచ్చారుగదా; "వచ్చే సంవత్సరంగూడా వర్ధిల్లమంటూ మంత్రాలు కాసిని మరిన్ని పాడవయ్యా" అంటే బాపనయ్య సమ్మెచేసి బజారు కెక్కుతాడూ? ఎక్కడే చూడు; యేకంగా పోకూడదూ? నూరుమంది చుట్టాలలో - నోరుచేసుకొని - నన్ను, నాయంతవాడిని "నీకేం? మడా, మయలా? అదుపా? ఆజ్ఞా? - ఏ గొల్లకొంపల్లో దూరావో, యే కుండలోనున్న పాలూ పెరుగు కడుపులో పోసుకున్నావో ఆకలనకుండా అరటిచెట్టుమల్లె నిలుచున్నావు. నేనుగూడా నకలుబ్రాహ్మణుడికి మాదిరి నాలుగిడ్డెనలు తిని, గుంటూరు ఆంధ్రరత్న భవనంలో గుక్కెడు కాఫీ తాగియుంటే "కీ" ఇచ్చిన గ్రామఫోనులా కేక లేయకపోయానా ?" అంటూ గయ్యాళిపెళ్ళాం మాదిరి గంతులేస్తాడూ? "పురోహితుడుగదా, పోనియ్యిలెమ్మంటూ" కాస్త ఘనంగా కొల్లాయి, కందిపప్పూ, అవీ, యివీ యిచ్చి పంపించి - యిలా యింట్లోకొస్తే యింకేముంది, "రవ్వల నెక్లెస్

యీవేళ తెచ్చిస్తావా? రాత్రికి భోజనం మానేస్తావా?" అంటూ పేచీపెట్టుకొని. పెళ్ళాం సమ్మెచేస్తే యేమిటి చేయటం? – ఎలా చేయటం? [అని లేచి ఆ వరండా లోనే అటూ, ఇటూ పచార్లుచేస్తూ; మళ్ళీ సిగరెట్ ముట్టించి, ఆలోచన నభినయిస్తూ. చేతినున్న గడియారంలో టైంచూచుకొని] మహేశ్ యింకా మాట్లాడటానికి రాలేదే!—ఫోన్ చేసిగూడా పూట కావోస్తూంది. [ఫోను దగ్గరకుబోయి డయిలు త్రిప్పుతూ] హాలో! ఎవరు మాటాడేది? ... ఓ పార్వతా? ఆc – అమ్మాయ్! వీడు యింట్లోలేడా? ఏమిటమ్మా యిక్కడకే వచ్చాడా? ఏడీ రాలేదే! ఆc, ఆc... XoX యింట్లో యేమయినా వున్నాడేమోనన్నా? అంటే XoXకోసం సపరేట్ హౌస్ రెంట్ కు తీసుకున్నాడా? యింకా "ఫూల్" అయి పోతున్నాడే, యిడియేట్. ... ... అవును. నిన్న జరిగిందటగా మా దేవమహిళాజన మహాసభ. నాకెందుకు తెలీదు. అయితే యేం జరిగిందేమిటి? ఏమిటేమిటి? "అఖిలభాషా ప్రపూర్ణ, కవితావాణి, యిత్యాదనేక బిరుదాంకితులును, సత్యలోకనగర మహారాణిగారున్నూ, ఉత్పత్తిశాఖామంత్రి బ్రహ్మశ్రీ బ్రహ్మన్నగారి యేకైకధర్మపత్నిగారయిన ఆల్ వరల్డ్ యెడ్యుకేషనల్ డైరెక్టరెస్ శ్రీమతి భారతీదేవిగా రధ్యక్షురాలా? ఐ, సి......"

[పొట్టిగా లావుగావుంటాడు. తలముందు సగంగొరికి వెనుకసగం జుట్టు ముడివేసివుంటుంది. చెవులో తులసిపత్రములు దోపియుంచుతాడు. నొసట కుంకుమబొట్టుంటుంది. తెల్లటిచొక్కా యిన్‌షర్ట్‌వేసి పైన గూడ కట్టు బిగించియుంటాడు. బుజాన ఓ టవలుంటుంది. చేతిలో గొడుగుంటుంది. బొడ్డులో పొడుంకాయవుంటుంది. తమలపాకులు నమలిన తమ్మ బుగ్గ నుంటుంది. కొంచెం భక్తాయాసంగా గణపతి వస్తాడు]

విష్ణు : హలో! గణపతిరావ్ ! సిడౌన్‌ప్లీజ్. [తానునూ కూరుచుంటూ] ఇంటిమీాషనన్నా లేకుండా యిలా వచ్చేశావు ?

గణపతి : మ రేమీా అవాంతరంలేదు మాటాడుదామని వచ్చాను. [కుర్చీలో కూరుచుంటూ, బొడ్డులోనుంచి పొడుంకాయతీసి, పొడుం చేతిలోవేసుకొని చిటికెడుపీల్చి నొసలు ఎగురవేస్తూ యెడమచేతిలో అతుకుకొనివున్న పొడుమును కుడిచేతివ్రేళ్ళతో దులువుకుంటూ] మ్యారేజీవిషయమై మా ఫాదరుగారితో మాటాడారా మరిచి పోయారా అడిగి తేల్చుకుందామని అలా అమాంతంగా వచ్చేశాను.

విష్ణు : [చైరులో వెనుకకు జాగిర్లబడి] మిష్టర్ గణపతిరావ్! మేలెంచి చెప్తున్నాను.

గణ : మ్యారేజిలేకుండా మేలేమిటండీ? ఉన్న పెళ్ళాలు చాలక ఉపరిపెళ్ళాల గట్టుకొన్నవారికి బ్రహ్మచారుల బాధ

తెలిస్తే యిలా మాటాడుతారా? ఇంతకాలం చూస్తూ ఊరుకుంటారా సార్ ?

విష్ణు : ఇదిగో గణపతీ! ఇండిపెండెంట్ వచ్చేక భార్యగలవాడి పనికంటె బ్రహ్మచారిపనే హాయిగావుందోయ్. పెళ్లాలతో సుఖపడటమనేదంతా పెద్దవాళ్ళతో నేపోయింది. ప్యారిస్ వారి ప్యాషనులు – ఆంగ్లేయులవారి యాచారాలు – సినిమాలోకపు సింగారాలు ఒచ్చేక భారతీయ ధర్మాన్ని బంధికానాలో పెట్టిన ఈ రోజుల్లో పెళ్ళాడినవాడి తిప్పలు పెరుమాళ్ళ కెరుక ?

గణ : అదేమిటండీ సార్! అలామాటాడుతారు. ఈ పెళ్ళి చేసుకున్నవాళ్ళకు వీళ్లంతా పెళ్ళాలంటారా? పెనుభూతాలంటారా?

విష్ణు : కట్టుకొనేటప్పుడు పెళ్లాలేగాని – కాలం జరిగేకొలదీ పెనుభూతా లవుతున్నారు. అందుకనే కాబోలు అనుభవించినవారంతా "సాగరమయినా యీదగలం గాని, సంసార మీదలేమ"ని రాటుదేలి రాయి గ్రుద్దుతున్నారు.

గణ : విష్ణూరావుగారూ! వేరేమీ అనుకోకండి గాని; అంత లావూకాకుండా, అంత సన్నంకాకుండా అందరిలాగా వుండే మీలాంటివారంతా జంటపెళ్ళాలతో తంటాలు

పడుతూంటే, ఎద్దంతమగాడ్ని - యెల్లాగోలాగా వక్క పెనుభూతంతో నన్నా వోపికపట్టలేనటండీ! అబ్బబ్బ! పదహారువేలసారులు మీ రెలా పెళ్ళాడగలిగారో గాని, పెళ్ళికొడుకునై పారాయణం పెట్టించుకొని వొక్కనాడయినా వుల్లాసంగా వుందామని యెంత యుబలాడపడుతున్నా నాతరంకా లేదు - నా యబ్బ తరం కావడంలేదు.

విష్ణు : అయితే గణపతిరావ్ ! నీ పెళ్ళికాకుండా నిలిచి పోయింది పిల్ల కుదరకనా? పైకం దొరక లేదనా?

గణ : ఎబ్బే! మనీ ట్రబుల్ మాకేం లేదుసార్! మా నాన్న గారికిన్నీ మనీలెండరు కుబేరరాజాగార్కి డియరెస్ట్ ఫ్రెండ్షిపన్నమాట. నే నేమిటి? నీ వేమిటి - ఆడామగ జన్మ లెత్తినవారంతా ఆమోదిస్తున్నారు ఆమోదించి తీరుతారు. పేచీపడ్డదంతా యిపుడు పిల్లవిషయం లోనేనండీ!

విష్ణు : పెళ్ళాడేవాడివి నీవేకాబట్టి, పిల్లవిషయంలో కాస్త శ్రద్ధగా తిరగరాదూ?

గణ : తిరగకుండా వూరికే తిని కూరుచుంటున్నానా? ఎక్క డకుబోయినా యేపిల్ల నడిగినా "వివాహ మయినా మానుకుంటాము"గాని. వినాయకుని మాత్రం చేసుకో మంటూాంటే యెలా చేసేది? ఆడపిల్లలంతా "అంద

గాడు'' కావాలా అంటారే! సుడిగాలివస్తే పడిపోయే వాళ్లు కావాలా? వానొచ్చినా వరదొచ్చినా నిలవబడి వుండేవాడిని నేనుకావాలా చెప్పండి? "పోనీ, పిల్ల కాయలకు తెలియకపోతే పెద్దవాళ్ళు మీరయినా చెప్పగూడదా ?'' అని మొన్న నే నో కన్యాదాతను మొగమాటం లేకుండా అడిగితే యెట్టకేలకు - తుట్టతుద కాయన గొంతుసవరించుకొని, గుండెనిబ్బరం చేసు కొని - అరగ్లాసు మంచినీరుతాగేక "అదికాదండీ ! మీ రల్లుడుగారయితే మీ కో పూటయినా అన్నం పెట్టలేమోనని ముందు మాకేభయ మంటూ ముగింపు చేశాడు. ప్రారంభోత్సవ శాఖామంత్రితో మాటాడే పరువు మరియాదలేనా చెప్పండి. లోకం కేసి చూచారూ? కాకుల్లా వాగిపోతొంటుంది. వినాయ కుడిపెళ్ళి రేపని వెక్కిరిస్తూందిగదా యెలా వింటూ సహించుకొమ్మంటారు మీరే చెప్పండి.

విష్ణు : లోకులమాటకే యింతలొంగిపోతే, భార్యతో రేపు నీ వేమిబాధలు పడతావోయ్! చెడ్డరోజులొచ్చి చేసు కున్న పెళ్ళాం, మాటభేధంతో పోయి మహిళాపార్టీలో చేరితే నీళ్లులేనిబావిలో నిచ్చెనేసుక దూకుతావను కుంటాను.

గణ : పెళ్ళి చేసుకుంటాను. పిల్లల్ని కంటామంటూంటే బావిలోపడమని బాగానే చెప్పారండీ? ప్రసిడెంటు

గారూ! పరాకులేకుండా చెప్పండి. ఇప్పుడిద్దరిభార్య లతోనే యింతవైరాగ్యం చెప్తున్నారే! పదహారువేల మందున్నా నా డెలా పట్టుకొచ్చేరండీ?

విష్ణు : కాలం మారిపోయింది - కట్టుబాట్లు మారిపోయాయి. "ఎంతవారలయినా కాంతదాసులే" నన్నట్లు నాగతి విప్పి చెప్పకుంటే నవ్విపోతావంటే నమ్ము. "రిపబ్లిక్ ప్రెసిడెంటు"నని రాచకీయంలో పేరు కెక్కినా, ఆడదాని దగ్గరికొస్తే అణాఖరీదు చేయలేకపోతున్నాను ఒక్క అణాఖరీదు.

[తలమీద టోపివుంటుంది. లాల్చీ తొడుగుతాడు; ధోవతియుంటుంది. పైన వల్లెవాటు. చేతిలో న్యూస్‌పత్రిక మడిచి పట్టుకొనివుంటాడు. కాళ్ళకు చెప్పులుంటాయి. ప్రవేశిస్తాడు మహేశ్.]

మహే : అణాఖరీదే చేసేలాగుంటే అనుకొంట మెందుకు? మగవారి కాపాటివిలువ మార్కెటులో వుందంటారా? [అంటూ కుర్చీలో కూర్చుంటాడు]

విష్ణు : లేదనే నేనూ వాదిస్తున్నాను. మహేశ్! నీవు మంచి పనిచేశావురా! తెలియక నీవు యిద్దరుపెళ్ళాల్ని చేసుకున్న దోషపరిహారణార్థం తెలిసి నీ కొడుక్కి వక్క పెళ్ళాంకూడా లేకుండాచేశావ్. దటీజ్ క్వైట్‌గుడ్.

మహే : "క్వైట్‌గుడ్" అని మీారు నన్నో క్లవరుహెడ్‌ని చేసిపారేశారు. "గెట్ ఔట్" అని గద్దించివేసి

నాపెళ్ళాం నన్నో పిచ్చిఫుల్లాయిని చేసేసింది. "దీని కంతకూ కారణ మేమా" యని దీక్షతో విచారిస్తే "భారతప్రభుత్వం బహుభార్యా నిరసన చట్టాన్ని అమలుపరిచిందని ప్రజ లాందోళన చేయటమే.

విష్ణు : అవును. అధికార పత్రికమీద నాముద్ర పడబట్టేగా అమలులోని కొచ్చింది! ఐ నో యిట్.

మహే : "ముద్రవేశారు కాబట్టే నిద్ర మేల్కొనండి ప్రసి డెంట్ గారూ!" యని పలుమార్లా చెప్పొచ్చేను, రుస్తుంనయినా రూల్సుప్రకారం నిలువబెట్టి నిజంతేల్చే తెగువగలవారా తెనుగుబిడ్డలున్న గుంటూరులో హైకోర్టంటే గుండెల్లో రైళ్ళు పరుగెత్తుతున్నాయి. బహుభార్యా నిషేధనకు బల మిచ్చామనుకోండి. మన రూల్స్ ననుసరించి మన పీకెలమీది కేమిరాదు గదా! విష్ణూరావుగారూ! విషఘుడియలు రాకముందే వివేకవంతులమై విరుగు డాలోచించకపోతే బజారులో పడుతుంది మన బండారమంతా.

విష్ణు : దాని కంత దడు పెందుకు మహేశ్? గోళ్ళతో తుంచే దానికి గొడ్డళ్లెందుకు! అంతగా కాదంటే అందరినీ పిలిపించి టిక్ టాక్ గా టీపార్టీ చేయించేద్దాం. మళ్ళీ మాటాడకుండా మచ్చికబడిపోతారు.

మహే: కాఫీనీళ్ళేకాదు - కరెన్సీ మొత్తమిచ్చినా నడత మార్చుకోని న్యాయం తప్పేవారు కారు. మన మిలా మదనపడుతున్నామని తెలిస్తే పత్రికావాళ్ళు మన పరువు కాస్తా తీస్తారు.

విష్ణు: ఈ విషయ మిలా యిందాకా తెచ్చింది నీవు?

మహే: నే నేంచేశానండి! నింద నామీద వెయ్యటానికి—?

విష్ణు: ఏంచేశావా? ఇంకా ఏం చేయాలి? ఆడదానిని అమాంతంగా తలమీది కెక్కించుకొని తయితక్క-లాడించిన మగాడీ మహేశ్ కాదూ?

మహే: అదా? ముందు మీరు మీ చిన్నభార్యను గుండెలు మీది కెక్కించుకొని కులుకులాడారు. గంగ కా మాట తెలియగానే గంగ వెఱ్ఱులెత్తాయి. "విష్ణురావంతటి వాడే వెనుకాలోచన లేకుండా లక్ష్మిని రొమ్ముల మీది కెక్కించుకొని లక్షణంగా తిరుగుతూంటే - ఆఫ్ట్రాల్ ఆడదానికి సగం శరీరమిచ్చి బజారులలో తిరిగే బిచ్చగాడివి నీ తలమీదకు నే నెందుకెక్క-గూడదూ?" అని బోనెక్కించి బోర్లదోసింది. గంగ మాటకు గడిదాటలేకపోయాను. తటస్థంగా "వ్వూ" కొట్టాను. తలమీదికెక్కింది.

విష్ణు: మహిళా సంఘాలు పెట్టి మాటవినని యీ రోజుల్లో "పెళ్ళెందుకు చేసుకున్నామా" అని మనం నొసు

స్తుంటే "పెళ్లెప్పు డవుతుందా!" యని మీావా డేడుస్తు న్నాడు మహేశ్!

మహే: మహేశ్‌గా రబ్బాయికి పెళ్ళికాలేదంటే మహాలావు నామర్దాగావుంది. చూడండీ! మావాడయినా నవ నాగరికులకుమల్లె మండిపడేవాడుకాడు. పట్నవాసపు పిల్లే కావాలని పట్టుదలా లేనప్పుడే పల్లెటూరు పిల్ల యినా ఫరవాలేదాయే. నాణ్యమయిన రుచులతో నవకాయ పిండివంటలు వండి విస్తట్లో వడ్డించలేక బోయినా కుడుములుండ్రాలుచేసి కడుపునిండా పెట్టే పిల్లయినాసరే కోడలును చేసుకోంటంలో మాకేమి కొరతలేదండి. కాబట్టి వెయ్యితిప్పలు బడయినా వినాయకుడి పెళ్ళి రేపుచెయ్యాలి.

విష్ణు: "రేపు" అన్నదానికి రూపు లేదన్నారు. వినాయకుడి పెళ్లి యెప్పుడూ రేపే.

గణ: రేపని మాపని రోజులుజరిపితే యీా గణపతిరావు ఇక ఊరుకోడు. ఈ గణపతిరావ్ – అంటే సన్ ఆఫ్ పశుపతి అన్నమాట. ఈ రోజున పెళ్ళికాదంటే ఇదేపోయి మగవారిపార్టీనుంచి మహిళాపార్టీలో చేరు తాడు. ప్రారంభోత్సవశాఖామంత్రి పదవినిగూడా రిజైను ఇచ్చేస్తానంటున్నాడు. ఇచ్చేస్తాడు కూడాను.

విష్ణు: నో. నో. యు ఆర్ బ్రెయిన్‌లెస్ ఫెలో లాగున్నావు. రాజీనామా లివ్వడం, రైళ్ళక్రింద పడటం ఓల్డ్ మోడల్ అయిందంటే ఒప్పుకొనితీరాలి. అయిన వాటికీ, కానివాటికీ సమ్మె సాగించటమే అప్ టు డేట్ అయిపోయింది. యీ ఇండియాలోనే కాదు. ఇంగ్లాండు - యీజిప్టు - ఆస్ట్రేలియా, ఆమెరికాల్లో గూడా స్ట్రయిక్ చేసినవాడికే స్థానం దొరుకుతూంది.

గణ: అయితే ఆలోచించి ఆటంబాంబులాంటి సూత్ర మొకటి దానిని సూటిగా చెప్పండి.

విష్ణు: అందుకనే చెప్పబోతే అక్కరలేదన్నావు. నీకోర్కె తప్పక నెరవేరాలంటే నిమిషాలమీద నీవు సత్యాగ్రహదీక్ష సాగించవోయ్. ఏది యెలాగున్నా యిదొకందుకు మంచిది. బక్కచిక్కి మనిషివి కాస్త బరువయినా తగ్గుతావు.

[కాళ్ళకు బూటు, ట్రౌజరు, ఇన్‌షర్ట్‌మీద కోటు, జేబులో కలాలు, నడింపావడదీసిన సమ్మరుక్రాఫ్, చేతిలో జేబురుమాలుతో బ్రహ్మన్న ప్రవేశం.]

బ్రహ్మన్న: ఎవరి బరువుతగ్గినా నా భారం తగ్గేదారి కనుపించలేదురా బాబూ [అంటూ కూర్చుంటాడు]

విష్ణు : అదోమిటోయ్! అలాఅంటావ్? పదవి కావాలని అలా ప్రాకులాడుతూంటే బరువుతగ్గలేదని బాధపడతావు బ్రహ్మన్నబహద్దూర్!

బ్రహ్మ : బాధకాకపోతే యేమిటండీ. వేధించుక తింటూంటే—మచ్చుకు చెప్పాలంటే మా ఆఫీసులో చూడండి. యీ నైన్‌టీన్‌ఫార్టీ వెళ్ళేనాటికి యించుమించుగా యావరేజి ఇండియన్స్ ముప్పయికోట్లు. తిరిగి నైన్‌టీన్ ఫిఫ్టీ వెళ్లేనాటికీ నలభై కోట్లు. ఈ పదిసంవత్సరాల్లో పదికోట్లు. అంటే యేటా ఒక కోటిజనాభా యింక్రీజ్ అవుతూనేవుంది. ఆఖరుమాటకొస్తే ఆహార శాఖావారు అధికజనాభాను చూచి హడలిపోయింది. బియ్యపు కంట్రోలు – బట్టల కంట్రోలు లాగానే బిడ్డలను కనటానికిగూడా కంట్రోలు పెట్టకపోతే కడుపునిండా తిండికే కరువొస్తుందని వార్తాపత్రికలు వాగిపోతున్నా మా ఉత్పత్తిశాఖా ఆఫీసులో వూపిరాడని వర్కుచేస్తున్నా – మా ఆఫీసులో ఓ రూపాయినా పెంచేరా చెప్పండి – నా చేతికిందికో అసిస్టెంటునయినా ఇచ్చారా? పోనీ, నాకో వాచీమేన్ నయినా మీరు సప్లయిచేశారా?

విష్ణు : తెలిసినవాడివి నువ్వూ తొందరపడితే యెలా? స్వరాజ్యంవచ్చినా ఇంకా శాంతి చేపడలేదు. వేరుపడ్డ

కాపరానికి ఏడేండ్లు కరువంటారుగదా, కొత్తరాజ్యం సులభంగా కుదటపడుతుందా బ్రహ్మన్నా!

గణ : ఏమండోయ్ బ్రహ్మన్నబహద్దర్ గారూ! మీ కర్మాగారంలో ఆడా మగా ఇంతమందిని తయారుచేస్తున్నారుగదా, నాకు వైఫ్‌గా నియమించటాని కో గరల్‌ను తయారుచేయించరాదటండీ?

బ్రహ్మ : లేదు మిస్టర్! న్యూ వెరైటీ మాఆఫీసులో నేనేం తయారుచేయించడం లేదు. అదీగాక, మీ సైజును కావాలంటే మెటీరియల్ మార్చి స్పెషల్‌వర్కర్‌కు సీటివ్వవలసొస్తుంది.

గణ : నన్నుగురించి మీరు నైట్‌వర్కయినా పెట్టించి తొందరలో తయారు చేయించాలండీ! మెటీరియల్ కొంచెం మంచిదిగా వుండాలన్నారు చూడండి మీరందులో ప్రత్యేకంగా శ్రద్ధవహించాలి. బొమికలు - అవి ఇవీ బలంగావుండేలాగానే పెట్టించాలి. మీ కేమైనాకావాలిసొస్తే మాఫాదరుగారితోరికమెండెషన్ చేసి బూడిదకోటానొకటి మీకు ఫ్రీగా ఇప్పిస్తాను.

మహే : ఉన్నహోదాకు ఇన్‌సల్ట్‌గా ఒక్కకోటా అంటావేం గణపతీ! వార్‌సీజనులో వల్లకాటి కొచ్చినవారినందరినీ తగలబెట్టగా తయారయినబూడిద మన గోడవునులో మరింతగా స్టాకున్నది. కావాలని వారనాలికాని

కాశీలో డైలీవచ్చే మన ఇఁకంలో బ్రహ్మన్నగారికి భాగమే ఇచ్చేద్దాం.

విష్ణు: చాటుగా మీ కెంత చేతికందించినా, పట్టుదలపట్టి మీవాడు పదిమందికి తెలిసేలా సత్యాగ్రహదీక్ష సాగించినపుడే బ్రహ్మన్నగారు బల్లమీద గ్రుద్ది పార్లమెంటులో ప్రపోజుచేసే వీలుంటుంది.

గణ: అదేమిటండీ; అన్యాయంగా చెప్తారు. కష్టమయినా సుఖమయినా – కాస్తయినా, కూస్తయినా మే మిచ్చుకోవాలా అనుకొన్నాం – మీరు పుచ్చుకోవాలా అనుకున్నారు. అంతవరకూ బాగానేవుంది. లంచం ఇచ్చుకొన్నాక గూడా యీ లంకణాలెందుకండీ?

బ్రహ్మ: సత్యాగ్రహమంటే సాంతంగా భోజనం మానమనా? అస లా అర్థం యే డిక్షనరీలోవుందో చెప్పమనండి. గణపతిరావ్! గాభరాపడతా వెందుకు? చచ్చిపోయేంత మనం చేసే దేమయినావుందా? అందుకుగాను, అతి జాగ్రత్తగా గోడచాటుగానైనా గొంతుతడుపుకోక పోతే మెడతిరగని పూలదండలు తెచ్చి మీద పడవేస్తున్నపుడు యీ బరువంతా మోసుకొని బజారులలో యెలా నడుస్తారు?

గణ: వాయనం కుడుములు తిని వయినంగాకూర్చొనే నాకు చాటుచాటుగా ఇచ్చే యీ కాఫీనీళ్లు చాలుతాయా, చస్తాయా?

విష్ణు : మరి పెళ్లంటే మాటలనుకున్నావా? కావాలనుకొన్న ప్పుడు కష్టపడితీరాలి. వధూ నిర్ణయానికే ఇలా వగలు పడేవాడివి కాపరం యీదటాని కెంత కష్టపడతావో అనుకొంటున్నా.

గణ : సత్యాగ్రహం చేయమంటే కష్టంగా వుంటుందిగాని, సంసారం చేయమంటే కష్ట మెందుకుంటుంది. ఆఫీ సరుగార్కి ఆడదిక్కు లేదని చిన్నా పెద్దా చెప్పు కుంటుంటే చెడ్డ సిగ్గుగావుంది. కష్టపడి సంపాదించినా కాళ్ళుకాళ్లూ కొట్టుకొంటూ ఇంటికి వెళ్ళంగానే కళ కళలాడుతూ పలకరించటానికి కాస్త పెళ్ళాం పిల్ల లేకపోతె నా మనసెంతగా నలిగిపోతుందంటారు?

మహే : అందుకనే మేమూ ఆమోదించాం గదా? అనవస రంగా యీ ఆలశ్యమెందుకు? ఇంటికి వెళ్ళి మీ అమ్మ వాళ్లకు చెప్పి యీరోజే సమ్మెనోటీసు పార్లమెంటు వారికి పదిలంగా అందించి – వేగం వెళ్లు.

గణ : సరే వెళ్లొస్తాను. ఏమండోయ్ బ్రహ్మన్నగారూ! సమ్మెచేసి నేను సన్నగిల్లిపోతూంటే యీదమరచి మీరు యేదో చేయకండీ! వెళ్లుతున్నాను విష్ణూరావు గారూ! [వెళ్ళును]

విష్ణు : [సిగరెట్టుముట్టించి బ్రహ్మన్నకు, మహేశ్ కు ఇచ్చి, తానునూ కాలుస్తూ ఓమాటు చిరునవ్వునవ్వి] వెళ్ళి –

పెళ్ళి. పిల్లాడికి బెల్లంగడ్డమీద యెలాంటి ప్రేమో, పడుచాడికి పెళ్ళాంమీద అలాంటి ప్రేమ. పెళ్ళయి తేనేగాని పిచ్చికుదరదు — పిచ్చికుదిరేక పెళ్ళాం వదిలి పోదు. పెళ్ళాలతో తిప్పలుపడలేకనే పెద్దపెద్దవా రంతా సన్యాసాలు పుచ్చుకొని సత్రాలపా లవుతున్నారు.

బ్రహ్మ : ఆ పద్ధతులీనాడేమీ అమలులో లేవుగదండీ ? మగడొదిలినముండకు మరియాదాలేదన్న రోజుల్లో బతికినంతకాలం భార్యను బ్రతికించితీరాలికాని కా దనుకుంటే కాగితాలురాసుకునే రోజుల్లో యేంభయం లేదు — ఇటు చూడండీ, యీ కోటు యీవేళ బాగుంది కనుక తొడిగాను. అంగడిలో శేషా కోటు అందంగా కనపడింది. ఉన్నదానిని వూడ దీశాను. తెచ్చిదానిని తగిలించుకొన్నాను. అంతేగా?— మొదటి మొగుడుమీద మోజు తీరిపోయిందనుకోండి. పాత పెనిమిటిని పిరాయింపుచేసి కొత్తభర్తను కొను క్కొచ్చుకుంటానికేగా విడాకుల చట్టం విస్తరించింది?

మహే : తిరిగి చూచుకుంటే యీ మహిళలేదో తిప్పలు తెచ్చేలాగున్నారు.

బ్రహ్మ : తిప్పలొచ్చే లాగుందని తిన్నగా అంటారేమండీ! మాటవరసగా అనుకుంటానికయినా నాకు మరొక్క

పెళ్ళాం లేదుకదా? ఉన్న దొక్క పెళ్ళామే నే ఎంత వోపికపట్టుతున్నా నామాటంటే భారతికి నలుసంత గూడా లెక్కలేదు. మొగుడుమాట మొద్దుల్లో గలిపినా అత్తగారిని చూచైన అదుపులో వుంటుందా అంటే లక్ష్మమ్మగా రున్నచోట తా నక్షరంగూడా నిలవదంట.

విష్ణు: అంతకుమించిన ఘనస్తురాలా అత్తగారయ్యా కొడుకా! లక్ష్మికి నా మాటంటేనే లక్ష్యంలేదాయె. చంచల బుద్ధితో తాను చెడిపోయింది చాలక, నిలకడా నీతీ లేని మనిషి అని నిందమోస్తూంటే పరువెక్కడ పోతుందోనని ప్రాణాలుచ్చుకుంటున్నాను.

బ్రహ్మ: అంతమాత్ర మయితే కొంతవరకు మేలే. తిరుగు బోతుతనమువల్ల తలవంపులేమోననేగాని, నూరుబెట్టి నోరుమూసే మాటకారి తనమోముతో మచ్చుకయినా కానరాదు. ఇక మా ఆవిడను మాటాడించేవీలులేదు. కవితాప్రాణిలోని కౌశల్యమునూ, అఖిలభాషా ప్రపూర్ణతలోని అసమానప్రతిభాచూపి ముక్కుమక్కు- గుక్కతిప్పుకోకుండా గుప్పించేస్తుంటే వుక్కిరిబిక్కిరై వుడ్డు కుడుసుకుంటున్నాను.

విష్ణు: బాగా చెప్పావోయ్ బ్రహ్మన్నబహద్దూర్! అలూ మగలుమధ్య అనేకముంటాయి. ఇంటిలో ఇల్లాలిచేత

దెబ్బలుతిని ఇంటిముందు డాబులుకొట్టేవా రుండగా మాటమిగిలిందని నీవింత మగ్గిపోతావెందుకు? ఇంటి గొడవ వీధిలో పడితే యెందుకయినా పనికొస్తామా చెప్పు?

మహే: ఆమాట చాలా అనుభవంగలదేలెండి. అందాకా యెందుకు? మీకు ద్వారకలో మినిష్టరుగావున్న రోజుల్లో పూలదగ్గర పోట్లాటబెట్టుకొని సత్తెమ్మగారు కాలితో మీతలను సతాయించినపుడు మరొకచెవిని బడకుండా మీరు మసులుకోలేదండీ! సర్దుకొనిపోయే నేర్పులేకపోతే సంసారాలు చేయనేలేము.

విష్ణు: ఏమి సర్దుకొంటమో యేమో, తోచడంలేదు. పెద్దా బిడ భూదేవితో యేమీ ఫర్వాలేదుకాని, చిన్నాబిడే నా ప్రాణాలు చేదుకుంటుంది. ఆ తిరుగుడు కేమైనా అంతంటూ వుంటుందా? ఎక్కడ మీటింగయినా తనకే మొదటివోటు – ఏ పెళ్ళయినా తనదే పెత్తన మంతాను. చిన్నపనయినా, పెద్ద పనయినా తాను లేకపోతే చెయ్యనేలేరని వాదిస్తుంది. తనకు స్వాగత మివ్వనివారంటూ మనలోకంలోనే లేరట – అబ్బబ్బా! ఏ మార్కెట్టులో చూచినా దానిగొడవే – ఏ యింటిలోవిన్నా దానిముచ్చటే.

విష్ణు ; సమావేశంకావటం – సభలు పెట్టుకోవటం, కొంత వరకెలాగో కూర్చుక పోవచ్చుననుకోండి. చర్చనీయాంశ మేమైవుంటుంది అనేది చాలా అవసరమయిన విషయం. కార్యనిర్వాహకవర్గమెలా కట్టుబాట్లు చేసుకొన్నారో కాస్తయినా తెలియలేదు.

గణ : ఆ సంగతిగూడా ఆచూకు పట్టుకొచ్చానండీ! "గానకోకిల భాషాచాతురుణి" "సాహిత్యా స్వరూపిణ్యా" ననేక బిరుదాంకితురాలు శ్రీమతి భారతదేవిగారిని అగ్రగణ్య సనాధిపత్యము వహింపమని ఆహ్వాన సందేశమందించారు.

బ్రహ్మ : ఆఁ – ఆడదాని చదువు అందాకా వచ్చిందీ? నాలుగక్షరంముక్కలు నేరిస్తేమటుకు నడుంగట్టుకొని వచ్చి అందరిలోకంటే ముందు అగ్రాసన మధిష్టించిందీ! బాగుంచి – బలేబాగుంది – బలే, బలే, బాగుంది.

గణ : "ధననిధి" యని భారతదేశంలో పేరుకెక్కటమేగాక "ఫ్లవర్‌గరల్" మరియు "వరల్డ్ ఆఫ్ కాప్టిలిస్ట్స్" అని విదేశాలలో గూడా విఖ్యాతిజెందిన శ్రీమతి లక్ష్మమ్మగారు కోశాధిపతినిగారు.

విష్ణు : అనుకున్నంతపనీ అయితీరిందన్నమాట. కానీ లేని పనేదీ కానేరదే, మగవారితో తగవాడినవారికి మనీ

ఏలాగాఅనుకొన్నా, చేచిక్కిందిగా మాచిన్నాబిడ్డ గారు. ఇంతవరకు వచ్చినవాళ్ళెంతయినా చేస్తారు. డబ్బుకేం కొదువ – డాబుకేం కొరవ? తరువాత?

గణ : తరువాతనా? "భారత వీరనారీమణి" పార్ట్నర్ ఆఫ్ హజ్‌బెండ్" యిత్యాదనేకబిరుదాంకితురాలు శ్రీమతి పార్వతిగారు కార్యదర్శిని.

మహే: ఇంకమిగిలింది అదేగా ! ఎంతయినా బాగుంది. అయితే; వాలెంటరీలు – సప్లయిర్స్ మొదలయిన వర్గమంతా వుందా? లేదా?

గణ : లెక్కకుమించిన తతంగమంతావుంటే లేకపోవటమేం పాపమండీ? కాఫీ, టీ తయారుచేయించే సర్వర్‌గా శ్రీమతి గంగాదేవిగారు కంకణంకట్టుకొన్నారు. వాలెంటరుగా భూదేవి ప్రేక్షకులనందరినీ వరుసగా సిటింగ్ అరంజ్‌మెంటు చేస్తున్నారు. లైటింగ్ డిపార్టుమెంటులో ఛాయాదేవమ్మగారు లక్షణంగా పని చేస్తున్నారు. తరువాత అనసూయాదేవిగారు ప్రారంభోపన్యాసానికి ఆమోదించారు, అంతేగాకుండా ఈరోజు సత్యాగ్రహదీక్షకూడా అనసూయాదేవిగారే సాగిస్తారట.

[తెరలో పెద్దగగోల వినిపిస్తుంటుంది. అందరూ తలలెత్తి ఆలకిస్తుంటారు. మళ్ళీ తెరలో గోలగా క్రిందిపాటలు వినిపిస్తాయి.]

అనసూయాదేవి : [నిలుచుండి వుంటుంది. మిగతావా ళ్ళంతా కూరుచుంటారు.]
మహిళామణులారా! ఈరోజు చాలా సుదినం. ఎందు చేతనంటే మనకష్టాలనుండి – మన దాస్య జీవితాల నుండి – మన స్వాతంత్ర్యానికి ముందడుగు వేస్తున్న రోజు. ఈ మగవాళ్లు – అంటె, మన మగవాళ్ళు మనల్ని; మన మహిళల్ని తరతరాలాదిగా, యుగ యుగాలనుండి వారి స్వార్థానికై వుపయోగించుకొంటు న్నారు. ఇక – యీ రోజునుండి – యీ క్షణం నుండికూడా వారియాటలు సాగనీయం – వారిపప్పులు ఉడకనీయం – అంతే. అది జరిగితే మనకు మేలుంది. మనంకూడా మగాళ్ళలాగే పుట్టాం – మగాళ్ళలాగే పెరిగాం – మగాళ్ళలాగే మాట్లాడుతున్నాం. తింటు న్నాం – తిరుగుతున్నాం. అయినా మనల్ని మగ వాళ్ళు కూపస్థమండూకంలాగా, అంటే బావిలోవుండే కప్పల్లాగా, యింటిలో, పడకటింటిలో, వంటింటిలో బంధించివైచారు. మనమంటే కేవలం పిల్లల్నికనటా నికో యంత్రాల్లాగా వుపయోగిస్తున్నారు. కనీసం వాళ్ళు పళ్ళుదోమినపుల్లను ఆపని పూర్తయాక చీలిచి పారవేసినట్లే మనల్నికూడా మక్కువతీరాక మనుష్యు ల్లోనే జమకట్టడంలేదు. నిజంచెప్పాలంటే నేననినట్లు ఆ పళ్లుదోము పుడకకంటే మనకేంయెక్కువ విలువ

వుందంటూరు? ఇదియెంత ఘోరం? కాస్త ఘోరమా? ఎలా సహించడం? ఇలాంటి స్వార్థులు - ద్రోహులు - నాటకం ఆడేవారు - నాన్‌సెన్‌సులు మనభర్తలని చెప్పుకోంటం గూడా అవమానకర మంటాను - హేయకరం - ఇన్‌సల్ట్. అనికూడా నేనీ ప్లాట్‌ఫారంమీద - నా స్వంతకంఠంతో - నా వాక్కుభుక్తమైనట్టి మనసుతో ఘట్టిగా చెబుతున్నాను. ఇదిగో అయితే, గియితే - మన పెళ్ళాలసమ్మె సాగితే, గీగితే - ప్రభుత్వం మన మెమోరాండం వింటే, గింటే - వాళ్ళవన్నింటినీ చెల్లిస్తే, గిల్లిస్తే - మనం కోరితే, గీరితే "మనమేమి కోరాలి?" అనేది హిమాలయంలాంటి హెమాహెమీ ప్రశ్న. అందుకోసమై అతి జాగ్రత్తగా ఆలోచించి తలకాయనంతా వుపయోగించి తయారుచేసిపెట్టిన కనీసపు కోరికలపట్టీ కాస్త చదువుతున్నాను. వినేవాళ్ళను వద్దనం. విననివారిని వినమన్నా వినరుకాబట్టి వినమనటం విరమించుకోంటున్నాం. శ్రీ శ్రీ శ్రీ మా ప్రభుత్వంవారికి సదరు మహిళామండలివారు సమర్పించుకొనిన మెమోరాండంలో కనపరచినకనీసపు కోర్కెలు :-

1. మగవారితోబాటు మహిళలకుగూడా వున్నతోద్యోగా లివ్వాలి.

2. బిడ్డలను కనేవంతుమాత్రమే స్త్రీలది. ఇందులో

[ఎ] శిశు పోషణాభారమంతయు మగవారిదే. అంటే, పిల్లలకు నీళ్ళుపోయుట, అన్నం పెట్టుట, నిద్దురపుచ్చుట మొదలగునవి.

[బి] పసిపిల్లలకు పాలవసరమయితే వారితరఫున వారి తం్రడులు మరియాదగా భార్యకు తెలియచేసుకోవాలి.

3. ఆడవాళ్ళు పుట్టింటికి, సినీమాకు, మీాటింగుకు పోవలయునంటే కాదనకుండా కర్చులన్నింటికీ పైకమిచ్చి పంపాలి. యిందులో

[ఎ] ఒకవేళ డబ్బు చాలకపోతే మళ్ళీ డబ్బుపంపాలి.

[బి] "ఎపుడు వస్తావు?" అని ఏమాత్రం అడగరాదు.

[సి] తిరిగొచ్చేక పైకమేమయినా మిగిలితే ముదరా యివ్వబడదు.

[డి] అయినకర్చుల జాబితా చూపమని కోరరాదు.

[ఇ] మేము పనులమీాద వెళ్ళినప్పుడు రావటం ఆలస్యమైతే వంట చేయవలెను.

4. మ్యారేజీస్‌లో గూడా స్త్రీమాట చెల్లాలి.

[ఎ] ఏకారణముచేనయినా మొదటాయనమీాద మనసు మారిపోతే యిరువదినాలుగు గంటలలో ఆ వివాహం

రద్దు చేసుకొని మళ్లీ పెళ్ళి చేసుకొంటానికి స్త్రీకి సంపూర్ణ స్వాతంత్ర్య ముండితీరాలి.

[బి] అన్ని సందర్భములలో ప్రతియొక్క కర్చు మగ వారే భరించాలి.

[సి] ఆ సంబంధమయిన సంతాన మేమయినా వుంటే ఆ సంతానంమీద ఆడవారియిష్టమే అనుసరించాలి.

[డి] మళ్ళీ పెళ్లి వరకూ వ్యవధాన బత్తెముక్రింద మూడు మాసాల కర్చు పాతభర్తగారే స్వయముగాచెల్లించి రసీదు పొందాలి.

4. కోర్టుచట్టాలు ముఖ్యంగా మహిళలకు సంబంధించి అన్ని పరిస్థితుల్లోనూ మా స్త్రీలుచేసిన తీర్పుప్రకారమే హిందూకోడ్ సరిదిద్దాలి.

భార : చూడండి అనసూయాదేవిగారూ! అక్కడ కొంచెం నిలపండి. ఆ ఐదో నిబంధనము అవసరమేనంటారా?

అన : ఆయువుపట్టే అదయితే అవసరమా అంటారేమండీ! పెద్ద వ్యవహారమొకటి పెండింగులోవుంది. మగబిడ్డలతోబాటు సగభాగానికింక ఆడపిల్లలుగూడా అర్హులు కావాలి.

లక్ష్మి : ఆ చట్టంమాటకొస్తే ఆదేం బాగులేదనాలి.

పార్వ : నో. నో. ఇటీజ్ యింపార్టెంట్ కొశ్చెన్.

లక్ష్మి : నే నా సబ్జక్టును న్యాయంగా వ్యతిరేకిస్తున్నాను.

పార్వ : వీలు లేనేలేదు. విధిగా జరగాలి.
లక్ష్మి : పార్వతీ! నీ విలాగే సంతానికొచ్చి పాటుకొచ్చిన దాన్ని పాడుచేస్తుంటావు—
పార్వ : నీ పక్షపాతమే నేటివరకూ ఆడజాతింకా అధోగతిలో ఉన్నది.
లక్ష్మి : పార్వతిమాట కాదంటే పక్షపాత మౌతుందా?
అన : సైలెన్స్ సైలెన్స్ - కాస్తకిందటి నెయ్యం కాస్తలోనే కయ్యమా? ఇన్‌సల్ట్ - చాలా యిన్‌సల్ట్. ఆడపెత్తనంలో తెలివి అప్పుడే చూపించారా? శ్రీమతి భారతీదేవిగారు వీరిని సమాధానపరుస్తారని ఆశిస్తున్నాను....
భార : [లేచి] మిస్ పార్వతీదేవిగారున్నూ, మిస్ లక్ష్మిదేవిగారు తీవ్రంగా పోట్లాడుకోబోయిన కారణం తెలిసినంతవరకు తేల్చి చెబుతాను. వీ రిద్దరివిషయాల్లోనూ విశేషమున్నదన్నమాట. పార్వతీదేవిగారు పరకాయించే మాట్లాడారు. ఎలాగంటే? —పార్వతీదేవిగారిది "వెరీ పూర్ ఫ్యామిలీ" అని విశదమయ్యేవున్నది. దక్షుడు వీరితండ్రి ధనసంపన్నుడు. సవతితండ్రిగారు కూడా సంపన్నగృహస్థుడు. వీ రిద్దరూ పుట్టిళ్ళదగ్గర నుండి విభాగాలు తెచ్చుకుంటే మహేశ్‌గారు రేపీపాటికి మహదాశ్చర్య సంపన్నుడై పోతాడు. ఇక లక్ష్మమ్మగారిమాట యేమిటంటే యిప్పటి కామె భాగ్యవంతురాలు. గంగమ్మగారు విష్ణూరావుగారికి గారాబాల

కుమారి. కామేశ్వరరావు లక్ష్మమ్మకు కడు ముద్దుల కొడుకు. ఆడవాళ్ళుకూడా అర్ధభాగస్తురాం డయితే కామేశ్వరరావుగారు క్యాపెటలులోనుంచి శిష్టరయిన గంగాదేవి పేరు పంచుకుపోతుంది అలా అయిందో, కూతురు కాపురం కోలుకొంటూంటే తల్లి సంపద తరలి పోతుంది.

లక్ష్మి ; [మహా కోపంతో] షటప్. చదువుకొన్న తెలివి చాలా బాగా చూపించావు. గంగ భాగం పంచుకు పోతుందని నేను గడగడలాడుతున్నానేం ? అయితే నీకూ ఆభయముండాలిగా? ఆడబిడ్డ ఆస్తికాస్తా మొగు డింటికి మోసుకపోతుంటే పరాయిగావచ్చిన కోడలు పళ్ళికిలించేదిన్నీ – కన్నతల్లి కాద నేదా?

భార : నా కా దిగులు నలుసంతా లేదు. తోడబుట్టిన వాళ్ళలో భాగంతో తోడితెచ్చుకునేటప్పుడు, అత్త వారింటిలో భాగం ఆడబిడ్డ తీసుకపోకుండా యెలా?

లక్ష్మి : మాటలునేర్చిన మాయదారివి నీతో యెవరుమాటాడి నెగ్గుతారే? కోడరికాని కొచ్చిందాది నీవిలా కొంటె కూతలు కూస్తుంటేనేకదూ? మునుముకు ముందుపుట్టిన మొదటిబిడ్డ బ్రహ్మన్నని కన్నకొడుకని గూడ అను కోకుండా కాపరం వేరే పెట్టించాలిసొచ్చింది?

భార : ఉన్నమాటంటే వులుకెందుకత్తా! కచ్చితంగా మాటా డితే కడుపయినా నిండుతుందా? లేటరీకి చెందినదానను

లక్షాధికారులలో తలెత్తుకతిరుగవచ్చిన తప్పంతా నాదే! వెళ్తానమ్మా! వెళతాను. [వెళ్లిపోతూంది]

అన : [చెయ్యిపట్టుకొని] భారతీదేవీ! ఇదేం బాగులేదు. అత్తాకోడళ్ళ అంతర్యవిరోధాలు—వదినా మరదళ్ళ వైరాల మాటలకేనా ఆర్భాటంచూపించి అందరమూ ఈసభ చేసింది?—[అందరివైపుచూచి చేతులుపైకెత్తి] ఆం-బోలో స్వతంత్రమహిళకీ జై. [లోపల] గాజు లమ్మ గాజులూ! రకరకాలగాజులు-రేడియోగాజులు-మాలపిల్లగాజులు - మల్లెపూలగాజులు - పంచరంగుల గాజులు - పాంచాలిగాజులు - ఘరానా గాజులు - గలగలగాజులు—

గంగరాజు : [తలగుడ్డ చుట్టుకొనివుంటాడు. ముఖాన తిరుచూర్ణంబొట్టు నిలువుగావుంటుంది. పెద్ద మీసాలుంటాయి. బుజాన గాజులమల్లారం, దానిమీద గొంగళి వుంటుంది. చేతిలో కఱ్ఱవుంటుంది. మామూలు పంచచెంగు ఎడమకాలిమీదికి దోపివుంటుంది. కాళ్ళకు చెప్పులతోవస్తాడు] గాజులు వేయించు కుంటారా? అమ్మగారూ! ఘరానాగాజులు - గలగల గాజులు.

అన : [రోషంగా] ఏయ్! గాజులగంగరాజూ! గాజులు తొడిగించేమమ్మిమ్మ గతికితెచ్చారు మా మగాళ్లు. ఈ

రోజునుంచి యీ ఆడోళ్ళు గాజులు తొడిగించుకొని గజ్జలగుత్తాల్లా తిరగరు.

గంగ : గాజూ పూసాతీసి గంగలో కలుపుతారా అమ్మగారూ! బాబుగారులందరూ బాగానే వున్నారుగదా; ముత్తైదువుతనంలో ముండమోపివేషాలా నాకే మాత్రమూ నచ్చలేదండి!

అన : [చాలాకోపంతో బిగ్గరగా] నోర్ మూయ్! నాన్ సెన్స్! ఇది నిన్ను మొదటిసారిగా యెక్స్యూజ్ చేస్తున్నాను. పో అవతలికి పో ముందు—

గంగ : [దడుస్తూ, సరేనని తలూపుతూ, అడుగులు వెనక్కివేస్తూ] వెళ్ళుతున్నా! వెళ్ళుతున్నా. పోతే పొట్టెలా నిండాలి? పెళ్ళాం పిల్లలున్న పెద్దకాపరం.

అన : అయితే అధికారులయిన మగవారివద్ద మనవిచేసుకో. అవసరమయితే ఆ మగాళ్ళకేతోడుగు – ఇకమీదట యిక్కడకొచ్చావా?—

గంగ : చిత్తం చిత్తం. మగవాళ్ళు గాజులేయించుకుంటే మాకు మంచిబేరముంటుందిగా? మాతల్లి తెలుసుకుంటే మారిపోనిదేముంది. మాచాబత్తులవారి మంతర మంతా వచ్చుగా? [వెళ్ళబోతూంటాడు]

అన : ఏమ్. గంగరాజు నీ భార్య మా సభకు నేడుకూడ రాలేదు?

గంగ : అదొక పిచ్చిమేళాంలే తల్లీ! అలా రాదండీ!

అన : "వట్టి పల్లెటూరి బ్రూట్" పట్టుబట్టి మేమే ప్రచారం చెయ్యాలి. సరే. నీవుపో.

గంగ : సరే—[పోవును]

అన : [ద్వేషాన్ని చూపిస్తూ] తొడిగినన్నాళ్ళు తొడిగారీ గాజులు - కలకాలం కళ్ళుమూసుకొని కూర్చుంటారనుకొన్నారేమో?

గంగ : [విష్ణూరావుగారి సమీపింగావచ్చి] మహారాజులు - మార్తాండతేజులు, ప్రభువులు, పాలించాలి.

విష్ణు : ఎవరవు నీవు! ఏమిటికథ?

గంగ : ఈవూరేనండి-యిక్కడేనండి. మా తాతముత్తాతా - మా తాత తాతా - మాతాత తండ్రీ - మా తాతా మా తండ్రీ - మేమూ యీ గాజుల మల్లారంమీదే యీనాటిదాకా బతుకుతున్నాం సార్!

మహే : పేరేమిటో చెప్పకుండా పెద్దదండకం ఎందుకయ్యా?

గంగ : గాజులగౌరీ రాజుకొడుకు గంగరాజునండీ!

బ్రహ్మ : అయితే యిపుడేం అవాంతరం వచ్చింది?

గంగ : ఏముందండీ! ఆడవారంతా సమ్మె చేశారు. ఆఖరుకు గాజులుగూడా వొద్దట. "కావాలంటే మగవారికే తొడగమ"ని కల్లెక్టుచేసి చెప్పారు.

గణ : మాదగ్గర నీవుచేసుకొనే మనవి యేమి?

గంగ : ఏమీలేదుబాబూ! ఎవరూ గాజులు తొడిగించుకోక పోతే, ఇంత పెద్దకాపరం యెలా గడుస్తుంది. కామందులవారు - కరుణామయులు, దయచూపించి దారి చూపించమంటూన్నాను బాబూ!

విష్ణు : సారా వ్యాపారస్థులతోటే సగం మనిషినై పోయాను. నిరుద్యోగ సమస్య నివారణకాకుండానే గాజుల వ్యాపారస్తుల గందరగోళము గూడానా? బాగుంది. గంగ రాజూ! నీసంగతి నేనే ఆలోచిస్తాను. కాస్తాగాక వచ్చి కనబడు. సరేనా?—

గంగ : ఏలినవారిదయ; యెలాచేస్తారో? ... [పోవును]

గణ : [లేచి, గబగబా మహిళాసభకు యెదురుగావచ్చి నిలుచుని పెద్దగా] వినండి. బాగావినండి. ఆడామగా వినండి. అందరూ వినండి. నాకీ ప్రారంభోత్సవశాఖామంత్రిపదవి పదిలంగావున్నా సరే - ప్రమోషనయినాసరే. అరవల యిడ్లీ సాంబారు మసాలావాసలు, యీ ఆంధ్రులా ఘ్రాణించినాసరే-ఆరగించినా సరే, ట్రైన్స్‌లో, యూరోప్లైన్స్‌లో ఫస్టుక్లాసు టికెట్టు యిచ్చినాసరే, ఫ్రీగా పొమ్మన్నాసరే నేను, నేనంటే యీ గణపతిరావుని యీరోజు యీ చోటులో, ఈ మహిళామండలివారి కనీసపుకోర్కెలు ప్రభుత్వం పాటించరాదని, అలా వారలు ఆమోదిస్తే పెళ్ళి చేసుకోనని పెద్ద ప్రతిజ్ఞ చేస్తున్నాను. ఇందుకు

యీా నా ఘోర ప్రతిజ్ఞకు యీా మంత్రివర్గం - యీా సినిమానటవర్గం - యీా పత్రికా విలేఖరీవర్గం - యీా సమ్మెచేస్తున్న మహిళా మండలివారుగూడా సాక్ష్యం. అలా మీా రెవరూ సాక్ష్యముండకపోతే నాకు నేనే సాక్ష్యముంటాను. మహిళా మండలివారిలాంటి విప్లవం లేవదీసిన ఈ రోజుల్లో మగవాళ్లంతా నా మాదిరే వివాహమాడటం విధిగా మానుకోనితీరాలి. ఆడవాళ్ళతో పెళ్ళి అక్కరేలేదు - అక్కరేలేదు - లేదు.

మహే : అవును. పెళ్లాలంతా కాదని పేచీపెట్టిందాకా యెందుకు? మగవాళ్ళందరికీ మహాసభ పెట్టించి సమ్మెలో చేరిన పెళ్ళాలతో సంబంధమే లేకుండా రాజాధికారంతోనైనా రాయించేద్దాం.

బ్రహ్మ : ఈరోజే యీాబిల్లు అమలుపరిపించి అందరినీ కట్టుబాటుచేద్దాం.

అన : చూచారా [బిత్తరచూపులుతో] మహిళామణులారా! మనం తప్వుకొన్నగొయ్యిలో మనమే పడ్డాం. మగవారుకూడా సంఘాలుపెట్టుకొని మనల్ని ప్రేమించడమే మానుకొంటే మనబెట్టు యెవరిమీాద చూపిస్తాం?

లక్ష్మి : కాస్త ఘనానికిపోతే కథ అడ్డంతిరిగింది. కాపరాలకే తిప్పలు తెచ్చుకొని కష్టాలపాలు కాబోతున్నాం.

పార్వ : జరిగిందిలా జాతరలోపడింది. జాగులేకుండా జారు కొంటం మంచిది.

భార : జారుకుంటే పూరి కేపోతుందా? అపరాధులమంటూ అపాలిజీ కోరుదాం.

విష్ణు : బ్రహ్మన్నా! మహేశ్! బాగావినండి. ఈబిల్లు ప్రకారంగా యిరవైనాలుగు గంటల్లో ఏ మగవాడయినా. ఏ కారణంచేనయినా విడాకులపత్రం రాసి వివాహం రద్దుచేసుకోడో వాడికి వారెంటు - ఉరిబైట పురిశిక్ష: అధికారపత్ర మిస్తాను. అమలుపరచండి.

అన : ఆగండి. పొరపాటని పూర్తిగా అంటున్నాం. ఆడ సభవారు అపాల్జీ కోరుకుంటున్నారు. మగవారు మన్నించాలి.

విష్ణు : అయిందానిని ఆమోదించాం. ఇకమీద బలవత్తర కారణంలేనిదే బజారులలో యిలా సమ్మెచేసేవారిని శాసన పూర్వకంగా మరణశిక్ష విధిస్తామని మరొక జి. ఓ......

అన : అవసరంగావుండాలని ఆమోదిస్తున్నాం.

గంగ : [వస్తూ] గాజులండోయి గాజులూ! ఘరానాగాజులు- గలగలగాజులు.

అన : గంగరాజూ! గాజులమల్లారమిటు పట్టుకరా!

గంగ: [దగ్గరకువచ్చి] అమ్మగారు వచ్చారండి.

అన: గంగరాజూ! గడిచిందేదో గడిచిపోయింది. తెలుగు లలనానీతి - వెలుగు వెలిగేజ్యోతి. మా స్త్రీల కలం కారమయిన మంగళప్రదగాజులు యివ్వు. స్థిమితంగా యింటికిపోయి చేతుల కేసుకొంటాం.

గంగ: పోనీయ్, తల్లీ! పుణ్యముంటుంది. నా జీవనం మళ్ళీ నాకు చూపించారు.

అన: అవును, "పెళ్ళాలసమ్మె" పూర్తయిపోయింది.

విష్ణు: అయితే, అందరూ యిండ్లకు పోవచ్చును.

గణ: భార్యలేని నాలాంటి బ్రహ్మచారులు వొంటరిగానే యింటిదారిబట్టినా, దంపతులుగానున్న వారందరూ దర్జాగా కబుర్లుచెప్పుకుంటూ కలిసివెళ్ళండి. నేనూ వస్తాను. శెలవు.